

# గాంధీ శతకము.



గ్రంథకర్త:—
చొల్లేటి నృసింహాశర్మ కవి.

ప్రకాశ ముద్రాక్షరశాల, సూర్యాపేటలో ముద్రితము.

9 9

" సరస రస భార పూరిత
మురళీధరు కరుణ మో. క. ♦ మోహన గాంధీ
చరితామృతరసపానము
బరితృప్తుని జేయ జన్మ ♦ బావనమయ్యెన్. "

బ్రి॥ శ్రీ॥ చిదంబరశాస్త్రి గారు,
చిక్కట్‌పల్లి,
హైదరాబాదు. (దక్షిణ)

## -:విజ్ఞప్తి:-

"అసతో మా సద్గమయ"
"తమసో మా జ్యోతిర్గమయ"
"మృత్యోర్మా అమృతం గమయ"

బాపూజీని యుగ పురుషుఁడనియు, ఋషియనియు, మహాత్ముఁడనియు పిలచుచున్నారు. నిజంగా ఆయన సర్వోత్తమ మానవ లక్షణ లక్షితుఁడైన యాధ్యాత్మిక పురుషుఁడు. దౌర్జన్య రాహిత్య విప్లవబ్రహ్మ. అప్రతిహత విభాసిత రాట్నచక్ర చక్రపాణి. అవిలుంఠితానన్య సామాన్య విలసిత సత్యాగ్రహ పాశుపతధారి. శాశ్వతానంద మోక్షసామ్రాజ్య ప్రాప్తికర వేదాంత సూత్రభాషి. భారత భాగ్యాభ్యుదయ విధాత. ఉదాత్తానుకంపపూర్ణ సర్వసమ్మత మత చక్రవర్తి. అసహనాతినికృష్ట లంపట జీవ ప్రీత పవిత్ర హృదయ కరుణా మూర్తి. సంకల్ప వికల్ప ప్రాయ మనోవిజయ తాపసి. జాతీతర కృతానివార్యావమానాది హాలాహల వశంకర శాంకరావతారి. భావోద్రేక గుప్త. విజేత బ్రహ్మచారి. రాజకీయవేత్తల తలమానికము అవిచ్ఛిన్నాహింస ధర్మచారి. ఖండఖండాంతర సంస్తవనీయ యశసావృత భారత జననీ జగజ్జేగీయమానైకైక పుత్రుఁడు. సర్వమానవ పూతనీయ తేజోమయావిశ్వాసితోత్కృష్ట శాంతమూర్తి. భారతీయ ద్వేషరోగ నివారిత భిషగ్వరుఁడు. వివిధకళామృత్యానుబోధక దేశికుఁడు.

ఇట్టి మహాపురుషుఁడగు మోహన్‌దాస్ కరంచంద్ గాంధి గారి 78 వ జన్మదినోత్సవ సందర్భమున వారికి కానుకగా అల్పజ్ఞుఁడ నగు నేనీ శతకము వ్రాసి సమర్పించుకొంటిని.

గ్రంథ ప్రకటన కాలము వఱకు శ్రీవారు పరమపదించుటచే నిర్యాణ కాలముందు వ్రాసిన అశ్రు తర్పణ పద్యము లిందుజేర్చితిని.

దేవరొప్పుల.
8—8—1949

ఇట్లు
చొల్లేటి నృసింహ శర్మ కవి.



# విషయానుక్రమణిక.

శ్రీ

# మో. క.

# గాంధీ శతకము.



క. శ్రీరమణుడు గౌరీరమ
ణీరమణుఁడు వాక్సతీమ ♦ ణీ రమణుండున్
శ్రీరస భృతులిడి బ్రోచుత
కారుణ్య పయోధి మో. క. ♦ గాంధి మహాత్మన్ ౧.

## —: బాల్యాది చరిత్ర :—

క. కూరిమితో నీజననియు
బ్యారెట్ లా చదువుటకును ♦ పంపుచునపుడున్
సారాయి ముట్టవద్దని
గారబమున జెప్పె మో. క. ♦ గాంధి మహాత్మా! ౨.

క. ఆరీతి నడచి ముద మల
రారగ కనతల్లి మాట ♦ లాలించిన నీ
చారిత్రము గనకయె ని
ష్కారణ మృతినొందె; మో. క. ♦ గాంధి మహాత్మా! 3.

క. పరపురుషుల గనెననుచును
నిరతము కస్తూరిబాను ♦ నిందించితినం
చఱముటి లేకను వ్రాసితే
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪.

# గాంధీ శతకము.

క. మరులుగొని నగలు దెమ్మను
నరనారుల గుణము నేర్వ ♦ నగు కస్తురిబా
దరి యొజ్జతనము సంస్తుతి
కరము కర్మయోగి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౫.

క. మురియుచు నాఫిరకేయులు
కరముగ నగలెన్నొ నిడిన ♦ కానుకలోన్
తరుణియడుగ సంస్థ కిచ్చితె
కరుణాకర ఋషివి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౬.

క. మఱువదు నిను నాఫిరికా
పరతంత్ర విముక్తి రీతి ♦ భారత ప్రజకున్
పరపంథి బాధ బాపెనొ
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭.

క. బిరుసుదనము చూపియు నిను
మొరటువటంచన్న యాంగ్ల ♦ మూకను గీతా
వర పాశ బద్ధుజేసితి
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮.

క. గోరక్షణ సంఘంబులు
దూరెను నిను రోగి గోవు ♦ దునుమన్ శాంతిన్
వారక రోషము బాపిన
కారుణ్యాంబోధి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౯.

## —:హరిజనోద్ధరణ:—

క. హరిజనజాలము నెట్లో
దరిజేర్చగ కంకణమ్ము ♦ దాలిచి నిందల్
సరకుం జేయక మెలగెదొ
కరుణాత్ముడ వీవు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౦.

క. ఘోరంబౌ యస్పృశ్య ని
వారణ సంపూరణేచ్ఛ ♦ వరదంబనుచున్
ధీరత జాటితివి బహి
ష్కార విదూరాత్మ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౧.

క. సరసను జనినంతనె భూ
సురు లొల్లని జాతివారు ♦ చొరుచుండిరిగా
హరిజనులు మందిరమ్ముల
కరమని నీ కృషిని; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౨.

క. హరిజనులే నీప్రాణము
హరిజనులే నీకు దేవ♦తా రాధకులున్
హరిజన పోషణజేసితి
కరముగ ఋషివర్య; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౩.

—:రాట్నము:—

క. భారత కోటీశ్వరులను
రారమ్మని జేరబిలిచి ♦ రాట్నము ద్రిప్పన్
నేరుపు దగు నెఱజాణవు
కారుణ్యాంబోధి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౪.

క. ఆరాటము యారాటము
పోరాటము మాన్పి కాయ ♦ పుష్టికలుంగున్
వారక రాట్నము వడికిన
కారణమున గాద; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౫.

క. ధరియింపుము దేశపు ఖ
ద్దరునంచును దానిచేత ♦ దారిద్ర్యంబుల్
దరిజేరవంచు బోధల
కరముగ జేసితివి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౬.

# గాంధీ శతకము.

క. అఱుసాచఁగ నందనిఫల
మరయఁగ రాట్నంబు దాన ♦ నందుము రాజ్యం
బరలేదు సత్యహింసా
కరమగు కృతియద్ది; మో.క. ♦ గాంధి మహాత్మా! ౧౭.

క. వరలుదురు నలుబదికో
ట్లరప్రజ రాట్నంబు వడుక ♦ హర్షించెదనం
చటిముటి పలికెదు నుడియను
కరణీయము మాకు; మో.క. ♦ గాంధి మహాత్మా! ౧౮.

క. దూరపిల్లు దేశమాతకు
చరఖాయే రక్షణంబు ♦ శాంతిదము మహా
త్తర సుఖప్రదమని జాటెదు
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౯.

క. తరతరముల నుండియు మే
మెఱిగిన ధర్మమునె జెప్పి ♦ యిది చేయుఁడనన్
నిరసించు రోజులరిగెను
కరముల జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౦.

క. మఱుగుపెరట ముత్తుత్రిప్పెడు
చరఖాయంత్రంబు రాజ్య ♦ సాధనమగునం
చరసెడు దివసము మడసెను
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౧.

క. తఱగెను మల్మల్ బట్టలు
చరఖా యింటింట వెలసె ♦ చేనేతలకే
ధర బెరిగె నీ మహత్తిది
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౨.

## —: కాంగ్రెసు గాథ :—

క. నౌరోజీ వే డర్బన్
శూరుఁడు హ్యూమ్ ముగురు మిగుల ♦ చొప్పడి గూడన్.
భారత కాంగ్రెస్ సంస్థకు,
కారణ భూతులరు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౩.

క. మారె ప్రభుత్వపు వైఖరి
కూరిమి కాంగ్రెసు వారు ♦ కోరినరీతిన్
భారత నష్టముపై యధి
కారము చర్చించ; మో, క. ♦ గాంధి మహాత్మా! ౨౪.

క. కరజను, మింటో, వంగను,
ఇరు విభజన జేసిరంచు ♦ నెగ్గులు పలుకన్,
దొరకొనిరి. విప్లవంబులు
కరముగ చెలరేగ ;మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౫.

క. తిరుమంత్రము వందేమా
తరము ప్రబలె, తెల్లవారి ♦ తరలింపంగన్,
బిర నడుముగట్టె విప్లవ
కరు లతి మోదమున; మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౬.

క. తరుణము గని మార్లెతో,
సరగున యోచించి కార్య ♦ శాసన సభలన్
మఱి కొన్ని హక్కు లిచ్చెను,
కరుణను మింటోను; మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౭.

క. ఐరోపా రణమందున
భోరున ప్రాణముల ధార ♦ పోసిరి దానన్
స్వారాజ్య మిత్తు రనియెడు
కాఱు మాట వినియు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౮.

క. దొరసాని అనిబిసెంటూ
త్వరగతి హోం రూలు లీగు ♦ స్థాపింపంగా
మురయుచు తిలకు, బెనర్జి
గరితకు తోడ్పైరి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౨౯.

క. నిరసింపగ 'రౌలట్ లా'
పరముగ 'జలియన్వాలబాగు' న గూడన్
దురితముగ కాల్పు గాల్చిరి,
కరుణే లేకుండ; మో. క. ♦ గాంధి మహాత్మా! 30.

క. ఉరి కంబంబున నుంచిరి
ఉరిబడ భగదత్తుసింగు ♦ నోహో! యన ని
ర్ఝరి బయలుదేరె నంతట
కరుణాకర యోగి; మో. క. ♦ గాంధి మహాత్మా! 3౧.

క. పరమదయాళుఁడు జార్జి
"మఱచిపోండు గతము" ననుచు ♦ మన నోదార్చన్,
దురితు బంట్ల నొలగించియు
గరిము నొకని బంపె; మో. క. ♦ గాంధి మహాత్మా! 3౨.

క. అరుదెంచెను "రీడింగు"
అరుగుదెంచి తీవుగూడ ♦ నాఫ్రిక నుండిన్,
శిరమెత్తి 'రలీ యనుజులు'
ఖరకరు లన నొప్ప మో. క. ♦ గాంధి మహాత్మా! 33.

క. తిరుమంత్రము, ఘనతంత్రము
దురితమ్ములు కొంచెమైన ♦ దోపగనీకన్,
జరిపితివి సహాయ నిరా
కరణము వా నొప్ప; మో. క. ♦ గాంధి మహాత్మా! 3౪.

క. స్వారాజ్యము బొందగను న
పారముగా పోరి నోడె ♦ బార్డోలి మలా
బారున చౌరీచౌరన
కారణ యల్లరులు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౩౫.

క. పరువెరుగక నిను నలి సో
దరులను, లాలాను ముందు ♦ దరిగా నమిచేన్
చెఱబెట్టిరి మీదగుసం
స్ఫురణ మబోధ్యంబు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౩౬.

క. నిరతము మానవ సేవయె
పరమాత్ముని సేవయంచు పాటుపడు నినున్
చెరఁ బెట్టిరి దుష్కర్ములు
కరముగ బాధించి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౩౭.

క. ఎఱవాడ చెఱను నుంచిరి
సురకళ పుంజంబుతోడ ♦ శోభిలెడు నినున్
దురితులు పాశ్చాత్యులు నా
గరికుల మనువారు; మో. క, ♦ గాంధి మహాత్మా! ౩౮.

క. ధీరత 'కర్ఫ్యూ అర్డరు'
చూరగొంటి వెన్నో సార్లు ♦ చోద్యము గాగన్
చౌరుల చెయ్దపు వెన్నెల
కారడవిని గాయు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౩౯.

క. దొరతనమువారి తీర్పుల
నరికట్టగ నెహ్రూ, దాసు ♦ నవ్యవిధంబున్
పరిపాలన పార్టీ విధి
గఱపిరి నెలకొల్పి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౦.

క. ఇరివిను ప్రిభు కాలంబున
అరుదెంచెను సైమననెడు ♦ నద్భుత కమిషన్
మరలెను ఖేదశేషను కిం
కరణంబని నడుగ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౧.

క. అరమర లేకను నిర్వ్వను
దొర లేబరు మంత్రిలకును ♦ దోపగ జెప్పెన్,
జరుపుట రౌండు టేబుల్, స
త్కార మంచని వేగ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౨.

క. వారిచ్చు వరము వద్దను
కారణమును నూతగొనుచు ♦ గాసిల జేయన్,
క్రూరతం జెఱంబెట్టెను, మమ
కారత యది గాదే; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౩.

క. ఇరువది యొక్క దినంబులు
నిరుపమ యుపవాస దీక్ష ♦ నీరస మొందన్,
భరతావనికై యక్కట!
గరపితివో, నీవు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౪,

క. నెర వేరని కార్యములకు,
పరగను సత్యాగ్రహంబు ♦ ప్రాకృత ఖడ్గం
బరి దమన కహింసా యను
కరవాలము నీకు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౫

క. సిరి సంపదలను విడచియు
భరతాంబకు సేవ జేయ ♦ భార్య, కుమారున్,
వెరవక వెనుగొనుటయె స
త్కార మంచును చాటు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౬.

క. నిరుపేదపు దేశంబున
సరస స్నేహానువృత్తి ♦ శాంతి స్థిరతన్
భరియింతు వ్యథల నన్నిటి
కరువను నది లేదు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౭.

క. వరుసగ నొకటియు, రెండును
జరిగెను రౌండ్టేబు లనెడు ♦ సభ ముమ్మారున్
నిరసించిరి లవణముపై
కఱమేటి కలంచు; మో. క. గాంధి మహాత్మా! ౪౮.

క. ఓరిమితో ‘ మెక్డొ నాల్డు ’
కూరిమి మీ కిరువురకును ♦ కుదురు వరకు తా
పేరొంద విధిని నిరుపమ
కారకుఁడై మెలఁగ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౪౯.

క. మతిమఱల సహాయ నిరా
కరణము సాగించ బంది♦ఖానం బెట్టన్
నిరశనము బూనినాడవు
కఱకుల హృది గరుగ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౫౦.

క. విరమింపగ ‘ కన్సెర్వేట్ ’
పరిపాలన విలింగుడన్ను ♦ ప్రభువుగ వచ్చెన్
త్వరలో బ్రకటింతును సం
స్కరణం బని నుడివె; మో. క. ♦ గాంధి మహాత్మా! ౫౧.

క. భోయన జేరితి లండను
దారుణ చలి బాధ నెట్లు ♦ తాళితి వయ్యా!
భారత బంధ విమోచన
కారణముగ నేగి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౫౨.

క. కొఱగాని కొడుకు తప్పులు
తలుగుకొనగ కడుపు తీపి ♦ తానెంచియు ని
బ్బరముగ మెదిలితి వహహా!
కరుణామయ నీవు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౫౩.

క. మెఱుఁగైన నీదు టోపీ
వెఱపును పుట్టించె రాజ్య ♦ వేత్తల తల నీ
వలుకను తత్వ మెఱుంగరు
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౫౪.

క. ఇరు ఇరువది కాంగ్రెస్ సభ
జరిగెను బెల్గామునందు ♦ జయముగ ని న్న
త్తరి యధ్యక్షుగ నిల్పిరి
కరుణాకర ధీర ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౫౫.

క. తిరిపెము నెత్తితి దేశము
కొరకై, నిరుపేదవయ్యు ♦ గొంకక, పాలే
పరమాన్నంబులు ఫలములు
కలు వెలుఁగని తిండి; మో.క. ♦ గాంధి మహాత్మా! ౫౬.

క. నీ రేజాసన ప్రభృతులు
తేరయ్యా తత్వ మెఱుఁగ ♦ త్రేశం బైనన్
భారత కీర్తి విధాతవు
కారుణ్యాంబోధి; మో.క. ♦ గాంధి మహాత్మా! ౫౭.

క. తరమే నిను పొగడఁగ త
త్తరపడు గంటంబు, ముసలి ♦ తాతవు మాకున్
బిరుదు మహాత్మా! వడసితి
కరుణాకర శూర; మో. క. ♦ గాంధి మహాత్మా! ౫౮.

క. విరివిగ వానర సేనగ
బరగిరి కాంగ్రెసు సభ్య ♦ పదవికి జన మ
త్సర వదనులు మఱియు నిర
త్సర కుత్సులు గూడ; మో. క. ♦ గాంధి మహాత్మా!

క. మిరియాలు నూరి వచ్చిన
పరిపంథియు నిన్నుజూచి ♦ ప్రాల్మాలియు, నిన్
దరిజేరి సంధి గూర్చును,
కరుణాకరమూర్తి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౦.

క. కూరిమి స్వాతంత్ర్యంబును
నేరుపుగా పొంది పిదప ♦ నే చత్తు ననన్
భారత జనని హసించెను
కారుణ్యాంబోధి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౧.

క. తరువాత రౌండుటేబుల్
జరిగెను కాంగ్రేసు రహిత ♦ సహకారముతోన్,
నిరణయమై ' వైటుపేపరు '
కరపత్రము వెడల; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౨.

క. హరిజన సవర్ణు లిద్దఱు
మురియుచు నొడబడిరి కలిసి ♦ పూనాలోనన్,
నిరసన భావన లేకను
గరపిన నీ బోధ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౩.

క. ఆఱు నొక్కొక్కటి కాంగ్రేస్
వారలు మంత్రిత్వపదవి ♦ వహియించుటకున్
ధీరత నొప్పిరి గవర్నర్
గారలు లోఁగుంద; మో. క. గాంధి మహాత్మా! ౭౪.

క. సరియనగా లిన్లిత్ గో
మతి భేషని రాజకీయ ♦ మాన్యులు మెచ్చన్
ఇరువర్షంబులు నేలిరి
గరువము లేకుండ; మో. క, ♦ గాంధి మహాత్మా! ౬౫.

క. ఘోరంబౌ రణరంగము
ప్రారంభంబయ్యె క్ష్మామ ♦ బాధలుఁ గలిఁగెన్,
కోరిరి యాంగ్లేయులు సహ
కారము కాంగ్రేసు మో. క. గాంధి మహాత్మా! ౬౬.

క. పరదేశీ 'స్టాఫర్డు క్రిప్సు'
సరసత గొని వచ్చి నట్టి ♦ సందేశ మెడన్
నిరసన చూపగ బందీ
కృతులైతిరి ముగురు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౬౭.

క. పరమ తముఁడు దేశాయీ
పరమపదము జేర యమిత ♦ బాధలు కలిగెన్
దొరకఁ డికఁ నిట్టి ప్రియుఁడగు
కరజ విదగ్ధుఁడు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౬౮.

క. గురు తర గుణ ఖని యగు క
స్తురిబా నినుఁ బాసె చెఱను ♦ క్షోభించి మదిన్,
కలుకులు తెలజాతుల ము
ష్కర కృతి కెరయయ్యె; మో. క. ♦ గాంధి మహాత్మా! ౬౯.

క. మారణ మంత్రోపాసక
వీరుఁడు మన నేత యిపుడు ♦ 'వేవెల్' గుణ వి
స్తారులు కాంగ్రేస్ మంత్రులు
కారుణ్యాంబోధి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౦.

క. ఆఱువది సంవత్సరములు
తిరిగితి నిష్కామ యోగి ♦ దేశికుఁడవుగా
మురిపెము గలిగెను ముందిఁక
కరణీయము లేదు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౧.

## —: ఇ త ర ము లు . :—

క. సరిహద్దున నొక గాంధీ
వరలెను, నీపేరు బలిమి ♦ వర్ధిల ఖ్యాతిన్
బరగెను సజ్జన సంగతి
కరముగ నట నొప్ప; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౨.

క. పరధనముల నాసింపవు
పరభాషల వాదములకు ♦ భాషింపవు యే
హారమును పాటును వదలవు
కరణీయ కృతార్థ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౩.

క. అరి యొక చెంపను గొట్టగ
మఱియొక చెంపందనీయ ♦ మానును వాడే
దురితమను నవ్య బోధను
గరపిన నిష్కామ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౪.

క. కారాకు డుల్లు నట్లుగ
భారత శృంఖలము డుల్లె, ♦ పావన మయ్యెన్
మీ రొనరించిన కృషియే
కారణము గదయ్య; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౫.

క. నీరస మున్నను మానపు
వారంబైనను తదేక ♦ వాంఛల తీర్పన్
వారక జరుపుచు నుందువు,
కారుణ్యాంబోధి. మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౬.

క. నిరశన వ్రతముల చేతను
పరిశ్రమ మధికంబు చేత ♦ పాటవ ముడిగెన్,
మఱి రాట్నయంత్రి మెప్పుడు
కరవీతము గాదు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౭.

క. ధరితము ఖద్దరు, విమనో
భరితము స్వారాజ్య కాంక్ష; ♦ భారత మాతా
చరితము, సజ్జననము, హిత
కరితము కృషి కర్మ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౭౮.

క. పరమతముల నిందింపవు
పొరుగు జనుల తోడి గిల్లి ♦ పోరాడవు, యె
వ్వరికి నపాయము తలపని
గరిముడ వీవరయ; మో. క ♦ గాంధి మహాత్మా! ౭౯.

క. పరుల మనమునకు నెప్పుడు
పరుసదనము దోచునట్టి ♦ బాటలవిడి నో
ప్పరికించు త్రోవఁ జూపితి
కరుణాకర నీవు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౦.

క. ఆఱు పదిపై పదునెనమిది
నిఱుప్ర కొనగ జన్మ దినము ♦ లెంతో ప్రీతిన్
జరిపిరి గైకొను డిదిగో
కరుణను, నాకృతిని; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౧.

క. వయస నహింసా పాఠం
బటిమిటి బోధించ నింక ♦ నారసి వర్ధా
సరసత సేవా గ్రామము
కరణిని పొందించు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౨

క. బారెడు దారపు బారిను
నారాముఁ డహర్నిశంబు ♦ నాట్యంబాడుఁ గా,
పేరిమిగల తత్వపు నుడి
కారం బమలంబు. మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౩

క. భారత పాంచాలికి నిడి
చీరలు మానంబు గాచి ♦ చెలఁగిన వనితో
ద్ధారా! రాట్నపు చక్రీ!
కారుణ్యాంబోధి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౪.

క. భారత స్వతంత్ర్య లక్ష్మి
చోరుల దరినుండి మఱల ♦ సాధించిన సీ
తా రామా నతు లివిగో
కారుణ్యాంబోధి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౫.

క. పర దేశము లందును ని
న్నెఱుగని శిశువైన లేదు ♦ యిలలో పూర్వం
దరు నోము లేమి నోచెనో
కరుణాకర పరిణుతి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౬.

క. పరగు జననంబు నక్టో
బరు నందున నందుచేత ♦ ఫసలీ యేడుఁ గా
సరి దిద్దిరి గణితమున సు
కరమగునని గాదె; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౭.

క. నిరతము ప్రసరిత ఛాయా
గురుతులఁగని మెలఁగె దేవి ♦ కొలఁకుల నశ్రుల్
మరణించవచ్చె నప్పుడె
గరిత సేవఁ దలఁచి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౮.

క. భరతావని శకలములుగ
తురకలు హిందువులు జేయ ♦ దొడగుట తగ దం
చఱిమిఱి తెల్పితి హృదయా
ల్కరుగవు కాసంత; మో. క. ♦ గాంధి మహాత్మా! ౮౯.

క. ఖారీ ధోవతి కట్టక
మూరెడు గోచియయె మేలు ♦ ముసుఁగులు గాగన్
జారిజితో భాషించిన
కారుణ్యాంభోధి; మో. క. గాంధి మహాత్మా! ౯౦.

క. జరుపరు మిము నడుగక సం
స్కరణము లేవైన నెహ్రూ, ♦ చారియు, నాజాద్,
మఱి జిన్న ప్రభులు సహితము
కరుణాకర యొజ్జ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౯౧.

క. పారకులు, లైబరీలును
గారవముగ వీధి, వాడ, ♦ గ్రామాదులు నీ
పేర నెలకొల్ప దొడగిరి
కారుణ్యాంభోధి; మో. క. గాంధి మహాత్మా! ౯౨.

క. ఓరుపు లేదని 'కమ్యూనిస్ట్'
పారిటి కాంగ్రెసు పట్ల ♦ వైరము బూనెన్,
నీరీతుల ఖండించదు
గారవముగ జూచు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౯౩.

క. జరుమను రష్యా యుద్ధము
బరుమా, జాపాను పోరు ♦ భరతావనినిన్
గిరగిర త్రిప్పఁగ జూచెను
కరఁడుగ నిను జేసి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౯౪.

క. పరిపరి విధముల వర్ధన
అరి యాయుధ హతిని వంగ ♦ నంచున్ వెడలెన్
జరుమని, సుభాసుచంద్రుడు
కరుణాకరయోగ; మో. క. ♦ గాంధి మహాత్మా! ౯౫.

క. వరుసగ స్టేట్ కాంగ్రెసులు,
వరువడిగా నిల్చి రాష్ట్ర ♦ వాసుల బాగల్
తరువడిగ దీర్చ సాగిరి
కరుణాకర యోగి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౯౬.

క. మరువము 'క్విట్ ఇండియా' సం
స్మరణం బాచరణయోగ్య ♦ సాధక మకుటన్
తిరుమంత్రము మా కయ్యది
కరుణాకరయోగి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౯౭.

క. వెరువక మత కలహములకు
నరిగితి నవఖాళి కాలి ♦ నడకన్ నీతుల్
గఱపితి ధన్యాత్ముండవు
కరుణాకరయోగి; మో. క. ♦ గాంధి మహాత్మా! ౯౮.

క. నిరుపమ సత్యాగ్రహమను
కరవాలము చేతబూని ♦ గాంధీకీ జయ్
అరచెదు వీరుల బందీ
కరు లొనరించి విడిచె మో. క. ♦ గాంధి మహాత్మా! ౯౯

## ఆశీస్సు.

—...—

క. పరిపూర్ణాయువు నిచ్చుత!
సరసోక్తి మగండు హారుఁడు ♦ చక్రియు నీకున్
చిరమగు నారోగ్యంబిడ
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౦౦.

క. భారత శీతోష్ణస్థితి
వారి నదీ నదము వనము ♦ పర్వత పంక్తుల్
ఆరోగ్యాయువు లిచ్చుత!
కారుణ్య పయోధి మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౦౧.

## ఆకృతి.

—(०)—

క. దరహాస వదన మిందిం
దిర నయనం బమల మాత్మ ♦ దేహమునతనం
బరచేతి మోడ్పు చూపుకు
కరములు జోడింతు; మో. క. ♦ గాంధి మహాత్మా! ౧౦౨.

సంపూర్ణమ్.



## నిర్యాణము.

సీ. చనిపోయెనా? గాంధి ♦ సాఫల్య సన్మనో
రథ సిద్ధి గాంచి దు♦రంబు చించి
తరలెనా? మోహన ♦ దాసు భారత మాత
దౌర్భాగ్య మేమందు ♦ తారసిల్ల
అరిగెనా? మాహాత్ముఁ ♦ డవతార విక్రమణో
ద్యమనంబు మనమున ♦ తలఁచి తలఁచి
మరణించెనా? హేతు ♦ వరయక దుష్టుఁ డొం
డొనరించి నట్టి దు♦శ్చార కృతిని
గీ. మందభాగ్య మా భారత ♦ మాతకంటి
నీరు యేఱులై పారఁ ద♦ద్వీర సూను
లక్కటక్కటా! యల్లాడ ♦ దిక్కులేక
కర్మ యోగి యేగెనె? స్వర్గ ♦ హర్మ్యములకు.

చ. కటు శ్రుతువైన నీ యొడలు ♦ గాసిలు వార్త క్షణంబులోన ని
క్కటి భువి విస్తరించ చయి♦దంబులు మానిరి ఘోరమారణం
బటయని విన్న దుష్టు డెవ♦డా యని చేతన శూన్యులైరి వి
స్ఫుటముగ శాంతి భద్రతలు ♦ పోయె నయో యని యంగలార్చు
(చున్.

శా. అల్లా! యెంతటి ఘోర వార్త ప్రచురం ♦ బై మింటిపై బ్రాకెనా
డిల్లీ పత్తనమే హరించెనని గాం♦ధీదేవునిన్ విన్న మా
యుల్లంబుల్ తలడిల్లె యింకకట! ని♦న్నోదార్చవా రెవ్వరో
తల్లీ! భారత మాత గొడ్డు వైనన్ ♦ నన్యాత్మవై యుందువో

మ. నిను గోల్పోయి భరించు టెట్లు సమతన్ ♦ నీఛాయగా తీరుపెల
న్ననుచున్నా నెహరూను జూపితివో మా ♦ గత్యంతరంబుల్ మరె
వ్వని వీక్షించగ బల్కినావో మరి నీ ♦ బాధల్ ప్రకోపించ కి
వ్వనకన్ మారణ మొందితో తలుప దుః♦ఖాంబోధి నుప్పొంగ
(గన్.

ఉ. ప్రేలెడు బాంబు నీపయిని ♦ ప్రేల్చిన వానిని నాదరింపగా
జాలిన గీత వాక్యముల ♦ జాలము గుప్పిన శాంతమూర్తి నీ
జోలికి రా వెరంతురు స♦జోలి యెఱుంగని నిన్ను చంపగా
జాలిన నీచు డీభరత ♦ జాతుడె? సోదరభాగ్యహర్తయే!



# బాపూజీ చారిత్రిక తేదీలు.

| | | |
|---|---|---|
| 2 వ అక్టోబరు | 1869 | జననము. |
| | 1882 | వివాహం |
| | 1885 | తండ్రిమరణం |
| | 1887 | మెట్రిక్ యందు త్తీర్ణత |
| | 1890 | బ్యారిస్టరీ పట్టము |
| | 1897 | దక్షిణాఫ్రికా ప్రయాణం |
| | 1900 | ట్రాన్సువాల్ సత్యాగ్రహం |
| | 1903 | ఇండియన్ ఒపీనియన్ పత్రికాధిపత్యం |
| | 1914 | లండన్ ప్రయాణం |
| | 1915 | ఇండియాలో సేవ |
| 6 వ ఏప్రిల్ | 1919 | సత్యాగ్రహ దినం ప్రారంభం |
| | 1920 | విదేశ వస్తు బహిష్కరణ |
| | 1922 | బార్డోలి విప్లవం |
| ఐక్యతాసభ | 1925 | సబర్మతీ ఆశ్రమం కాంగ్రెసు అధ్యక్షత |
| మార్చి | 1930 | ఉప్పు సత్యాగ్రహం |
| జనవరి | 1931 | రౌండుటేబుల్ సమావేశం |
| | 1933 | సత్యాగ్రహం |
| | 1934—1935 | హరిజనోద్యమం |
| | 1936 | పాకిస్థాన్ చీలికయత్నం [గ్రహం |
| | 1940 | ,, బహిర్గతం వాక్స్వాతంత్ర్య సత్యా |
| ఆగస్టు | 1942 | క్రిప్సురాయబారం, క్విట్ ఇండియాతీర్మానం |
| | 1943 | దేశాయి, కస్తూరిబాల మరణం |
| | 15-8-1947 | కలకత్తా అల్లరులు |
| | 18-8-1947 | స్వాతంత్ర్యం |
| 30 జనవరి | 1948 | బాపూజీ నిర్యాణము. |



# శ్రీకృష్ణ జన్మస్థానము.

దక్షిణాఫ్రికాలో (4 నెలలు)

10 జనవరి1908 జోహన్సుబర్గులో ౨ నెలలు కాని 30జనవరి విడుదల
15 అక్టోబరు 1908 వోక్ సుస్ట్రి ౨ నెలలు
9 నవంబరు 1913 దండీ ౯ నెలలు కాని 18 డిసెంబరు విడుదల

ఇండియాలో (6 ఏండ్లు 3 నెలల 11 రోజులు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 18 | మార్చి | 1922 | ఎరవాడ | ౬ ఏండ్లు కాని | 7-2-1924 | విడుదల |
| 5 | మే | 1930 | ,, | | 26-1-1931 | ,, |
| 4 | జనవరి | 1932 | ,, | | 8-5-1933 | ,, |
| 4 | ఆగస్టు | 1933 | ,, | ౧ ఏడాది | 23-8-1933 | ,, |
| 9 | ,, | 1942 | ,, | | 6-5-1944 | ,, |

## ఉపవాసాలు. (107 రోజులు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఫిబ్రవరి | 1918 | అహమదాబాదు | 3 | రోజులు | కార్మికులకొరకు |
| నవంబరు | 1921 | | ౫ | ,, | ప్రిన్సు వచ్చినప్పుడు |
| ఫిబ్రవరి | 1922 | చౌరీచౌరా | ౫ | ,, | |
| సెప్టెంబరు | 1924 | | ౨౧ | ,, | మతకలహాలు |
| నవంబరు | 1925 | సబర్మతీ | ౭ | ,, | ఆశ్రమవాసుల నేరం |
| సెప్టెంబరు | 1932 | | ౬ | ,, | మాక్డోనాల్డు వార్డుకొరకు |
| మే | 1933 | | 3 | వారాలు | ఆత్మశుద్ధి కొరకు |
| ఆగస్టు | ,, | | ౪ | రోజులు | జైలు సౌకర్యాలకొరకు |
| మార్చి | 1939 | రాజకోట వివాదం | ౪ | ,, | |
| ఫిబ్రవరి | 1943 | | 3 | వారాలు | ఆత్మశుద్ధికొరకు |
| సెప్టెంబరు | 1947 | | ౪ | రోజులు | కలకత్తా కొట్లాట |
| జనవరి | 1948 | | ౬ | ,, | మతకలహాలకు |

# ప్రకాశ ముద్రాక్షరశాల సూర్యాపేట.

మా వద్ద తెలుగు, హిందీ, ఇంగ్లీషు, ఉర్దు భాషలలో అన్ని రకముల అచ్చుపనులు, బైండింగుపనులు జరుగును. మీకేవైన పై పనులు కావలసిన మా పైవిలాసమునకు వ్రాయుడు.